# కథ కాస్త వింటారా ?

భీము బందిపోటు. పచ్చిరక్తం తాగే మనిషి. కత్తియుద్ధంలో సాటిలేని వీరుడు. మంత్రి ప్రోత్సాహంతో మహారాజునే హత్యచేసి రాజభవనాన్ని కొల్లగొడతాడు. ఆ అదనులో చిన్నపిల్ల రాకుమారి భీమూ గూడెం చేరుతుంది. భీమూ కొడుకు ఆ పిల్ల తండ్రిని తీసుకువస్తానని బయలుదేరి అడవిలో పడిపోయి అన్నీ మరచి మహారాణి ఆశ్రయాన్ని పొందుతాడు.

తన సౌభాగ్యాన్ని హరించిన దుర్మార్గుడిమీద పగతీర్చుకోవాలనే ఆశయంతో తనవద్ద చేరిన బాలుణ్ణి పెంచి మహావీరుణ్ణి చేస్తుంది మహారాణి. తాను పొందుదామనుకున్న సింహాసనం ఆ వీరుడికి పోతుందేమోనని భయపడి మంత్రి మోసంతో రాణిని విజయ్‌ని బంధిస్తాడు. కాని విజయ్ ఖైదునించి తప్పించుకుంటాడు.

కొడుకును కోల్పోయిన భీమూ రాకుమారినే కన్నకూతురిలా పెంచి పెద్దదాన్ని చేస్తాడు. ఆ పిల్ల కళ్యాణి, భీమూతో దోపిడీలు, హత్యలు మాన్పించి అతన్ని మంచివాణ్ణి చేస్తుంది. అడవిలో అకస్మాత్తుగా కలుసుకున్న విజయ్, కళ్యాణి పరస్పరం ప్రేమించుకుంటారు.

మంచివాడుగా మారిన భీమూ ద్వారా విజయ్‌ని చంపించడానికి మంత్రి ప్రయత్నిస్తాడు. కాని విజయ్ వీరుడని

గ్రహించిన భీమూ కళ్యాణిని అతనికిచ్చి వివాహం చెయ్యడానికి అంగీకరిస్తాడు. ఈ సంగతి తెలిసిన మంత్రి భీమూని కోటను రప్పించి బంధిస్తాడు.

కోటను ముట్టడించి విజయ్, కళ్యాణి మహారాణిని, భీమూని విడిపిస్తారు. అక్కడే విజయ్ చేతిలో మంత్రి మరణిస్తాడు. ఒక అద్భుతో లగ్నంగా మహారాజ హంతకుని బంధించి తీసుకురమ్మని మహారాణి విజయ్‌ని కోరుతుంది. భీమూయే ఆ వ్యక్తి అని విజయ్‌కి తెలుస్తుంది.

భీమూకి, విజయ్‌కి భయంకరమైన కత్తియుద్ధం జరుగుతుంది. ఆ పోరాటంలో ఏదో గుర్తుద్వారా విజయ్ తప్పిపోయిన తన కుమారుడే అని భీమూ గుర్తిస్తాడు. తనకు లొంగిపోయిన భీమూని బంధించి మహారాణి వద్దకు తీసుకుపోతాడు విజయ్. మహారాణి అతనికి మరణశిక్ష విధిస్తుంది.

అంతకాలం కన్నకూతురిలా చూసుకున్న కళ్యాణి రహస్యాన్ని వెల్లడించి ఆమెను మహారాణికప్పగిస్తాడు భీమూ. భీమూ ఉరిశిక్ష రద్దు చేయించడానికి కళ్యాణి ప్రయత్నిస్తుంది. కాని, మహారాణి అందుకంగీకరించదు. భీమూ తన తండ్రి అని తెలిసి విజయ్ బాధపడతాడు.

ఆఖరికి భీమూ ఉరికంబానికి తీసుకుపోబడతాడు. అక్కడ — — — ???

# ఈ పాటలు పాడుకోండి

## 1

రచన: కనకమేడల  పాట: బి. గోపాలం, జానకి

మాంత్రికుడు :    ఇంద్రజాలం మహేంద్రజాలం
ఇంద్రజాలం మహేంద్రజాలం

పగలేచుక్కలు పొడిపిస్తా
చక్కని చుక్కల పిలిపిస్తా
అచ్చర కన్నెను రప్పిస్తా
ఆటలు పాటలు పాడిస్తా

చకచక చకచక టకటక టకటక
దిగిరావమ్మా — ఓ బొమ్మా!

దేవకన్య :    మాటలు — కొసరి మాటలు
చూపులు — విసరి చూపులు
మాటలు కొసరి చూపులు విసరి
మన్మథ బాణాలు తెచ్చితివేయా
ఓర్వగజాల విరాళీ!

ఒంపులు నింపేను సొంపులు చూపేను
ఒంపులు నింపేను సొంపులు చూపేను

మాంత్రికుడు :    ఇంద్రజాలం మహేంద్రజాలం
ఇంద్రజాలం మహేంద్రజాలం

నాగుల కన్నెను కనరండీ
నాట్యము చేయును చూడండీ
బిరబిర బిరబిర చరచర చరచర
లేలేవమ్మా — నాగమ్మా !

నాగకన్య : మనసులోని మమతేమో
గుసగుసలం బల్కి పిలిచేనా
ఎడదలోని వలపేమో
బుసబుసలంకొట్టి కలిచేనా
పిలువగ వచ్చాను వలపే తెచ్చాను
ఆడీ పాడీ ఒరిగేనా
ఊగెదనా సాగెదనా
ఊగేనా సాగేనా
ఆడేనా పాడేనా
ఊగేను సాగేనా, ఆడేను పాడేనా
గేనా పాడేనా, ఆడేనా పాడేనా

## 2

రచన : కనకమేడల   పాట : పి. సుశీ

వచ్చావులే వచ్చావులే
మా ఇంటికి వన్నె తెచ్చావులే
మా కంటికి వెలుగు నిచ్చావులే
మాలోన రేగే విషాదాలలోనా
మా ఎదల నిండే తిమిరాలలోనా

సంతోషమిచ్చే చిరుకాంతులిచ్చే
చందురుడవీవౌచు తనయా — ॥వ॥

ఈ రాజ్యకన్య కలలెన్నో కనుచు
ఈ నాడు నీకై ఎదురుచూచెలేరా
బంగారుతండ్రీ నవమన్మథుడవై
ప్రేమించి పాలించుకోరా— ॥వ॥

# 3

రచన: కె. జి. వసంతాదేవి   పాట: పి. సుశీల

దారికాచి వేచినానురా
రేయిబవలు చూచినానురా

వన్నెలెన్నో చూపినావు
కన్నెమనసు దోచినావు
బాసచేసి పోయినావురా
ఓ వన్నెకాడ
రేయిబవలు చూచినానురా

మల్లెచెట్టు మొగ్గబట్టె
మావిమాను పూతబట్టె
వస్తవన్న గడువుదాటెరా
ఓ అందగాడ
దారికాచి వేచినానురా

6

వానకాలం ఎదురువచ్చె
వాగులన్నీ పొంగివచ్చె
ఓ వన్నెకాడ నిన్నుచూడ
కన్నకలలు కల్లలాయెరా
దారికాచి వేచినానురా

# 4

## రచన: కనకమేడల

## పాట: పి. బి. శ్రీనివాస్, పి. సుశీల

కళ్యాణి: తుంటరి చినవాడా ఈ
కొంటెతనమేలా
కన్నెను నన్నూ
విడకున్నా తగదనినా

విజయ్: గూటిని కూడెను గువ్వలజంటా
గుండెలలో నా గుబులేరేగే

కళ్యాణి: తొందరపడినా అందున ఫలమూ
కొందలమందీ పొందునదేమీ

విజయ్: చెంతకుచేరీ మంతనమాడీ
వంతనుగూర్చిపోయే వా
చక్కని చినదానా ఈ
టక్కరితనమేలా

కళ్యాణి : ఏమని తెలుపుదు నీవిటులనగా
ఏగతి నిన్నూ వేడుకొనేది

విజయ్ : అందముచూపీ డెందముదోచీ
ఒంటరిచేసీ చనగా తగునా

కళ్యాణి : రేపటి వేళా తప్పక రానా
నేటికిచాలు — వేళాయే

# 5

రచన : శంకరంబాడి సుందరాచారి

పాట : మాధవపెద్ది సత్యం

అదే అదే వద్దంటా పదేపదే చెబుతుంటా
అందాల నా గుంటా ఆశలా నా పంటా— అ॥

అందుపడనంటావు సందు ఇడనంటావు
చల్లని రాతిరిని ఒల్ల నంటుంటావు
సంతోష సమయాన్ని సాగిపొమ్మంటావు— అ॥

అల్లదిగో చందురుడు అడివెల్గ కాస్తుంటే
కొమ్మల్లో కోయిలలు కోయంటూ కూస్తుంటే
చప్పరిస్తుంటానా పన్నాసినానేనూ— అ॥

పరసాలు నాకొద్దూ చాలసేపుండొద్దూ
సంకోచపడవొద్దు చంపుకు తినవొద్దు
జాలిచూడీ పొద్దు చాలు నొక్క ముద్దు— అ॥

# 6

రచన : కనకమేడల                పాట : పి. సుశీల

పరవళ్లు తొక్కేను నా మనసు ఈవేళ
పరవశమందేను నా ఒళ్లూ—
సిగ్గు సిగ్గుగా ఉందీ
గుబులు గుబులుగా ఉందీ
ఒళ్లు పులకరిస్తోందీ
మనసెల్లాగో ఉందీ— ప॥

పువ్వు పువ్వులో తేనుందీ
పండు పండులో తీపుందీ
గుండెల్లో ప్రేముందీ
ప్రేమల్లో హాయుందీ— ప॥

చిన్నారాశికీ మనసుందీ
మనస్సు నిండుగా మమతుందీ
మనసిచ్చే చోటుందీ
మమతెరిగే తావుందీ— ప॥

—:o:—

## నటీనటులు :

బాలయ్య, రాజనాల, రేలంగి, మిక్కిలినేని, రాజశ్రీ, హేమలత, శాంత, సుశీల, ఎ. వి. సుబ్బారావు (జూ॥), జగ్గారావు, రాజారెడ్డి, కె. వి. చలం, మాస్టర్ బాబు, బేబి ఇందిర....

## టెక్నీషియన్స్ :

రచన, నిర్మాణం : కనకమేడల

దర్శకత్వం : కె. వి. నందన్‌రావు

ఛాయాగ్రహణం : హెచ్. ఎస్. వేణు

సంగీతం : టి. గోపాలం

ఆర్ట్ : ఎం. సోమనాథ్

ఎడిటింగ్ : ఆర్. హనుమంతరావు

నృత్యాలు : కె. ఎస్. రెడ్డి

## డిస్ట్రిబ్యూటర్స్ :

ఆంధ్ర : అపరాజిత, సీడెడ్ : ఎస్. ఎ. డి., నైజాం : ఈ సాఫిలింస్, మైసూర్ : బ్రైట్ పిక్చర్స్